

శ్రీ.

శ్రీమతేరామానుజాయనమః

# జగన్నాథాచార్యస్తవము.

శ్రీమద్యతీంద్ర పాదారవింద సేవామూర్తులగు

భాగవతుల కనుసంధానయోగ్యంబై యొప్పు

జగన్నాథాచార్య స్తవము, తిరునామములు, మంగళహార

తులు పోకలజగన్నాథదాసుగారిచే రచియింపబడి.

ఆర్యవైశ్య ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

మహారాజశ్రీ మద్దు వెంకటరత్నంగారిచే

ప్రకటింపబడెను.

గుంటూరు.

శ్రీ







* శ్రీరస్తు. *

శ్రీమతేరామానుజాయనమః

---

## జగన్నాథాచార్యస్తవము.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయక నిఖిలహేయ ప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూప నిత్యముక్త పరిషద్గీయమాన మహావైభవ శ్రియఃపతి సర్వస్వామిత్వ సౌశీల్య వాత్సల్య సౌలభ్యాది కళ్యాణగుణామృత రసాస్వాదనాసక్త శ్రీమద్రామానుజ చరణారవింద మకరందపాన మత్తమధుకరాయమాన శ్రీమచ్చిరిపురం కందాళజగన్నాథాచార్యవర్య పాదపద్మయుగళ కైంకర్య సుఖానుభవ సంపన్నుండును పోకల వంశపయఃపారావార రాకాసుధాకర వరాంకుశ దాసపుత్రుండునగు జగన్నాథదాసునిచే రచియింపబడి శ్రీభాష్యకార ప్రభావాతిశయంబులును సకలదోషరాహిత్యంబును సకలశుభావహత్వంబును గలిగి భాగవతుల కనవరతానుసంధానయోగ్యంబై యొప్పు యీజగన్నాథార్యస్తోత్రంబు పండితులగు వారిచేతనున్నూ త్సవటపల్లి వంశరత్నాకరుండగు వెంకట నరశింహస్వామిగారి వల్లనున్నూ పరిష్కరింపబడినది. భాగవతోత్తములు నీరంబు పరిత్యజించి క్షీరంబుగ్రోలు రాయంచ చందంబున నిందులతప్పులు క్షమించి యొప్పులు గ్రహింతురుగాత



జగన్నాథాచార్య స్తవము.

శ్లో॥ బలరామగురోచ్ఛిష్యం శ్రీవాత్సకులభూషణం।
నృశింహాచార్యసత్పుత్రం। జగన్నాథార్యమాశ్రయే॥

కందపద్యములు.

౧ శ్రీరమణీనాయకుతో కారుణ్యముపొంగ చేతనావళినెల్లన్। నీరత
బ్రోచెదనంటివి జేరితిమీచరణయుగము జగన్నాథార్యా।

౨ ఆరుద్రతిరునక్షత్రము సూరులుబొగడంగ కాంతిమతిగర్భమునన్
కోరికతోనుదయించితి జేరితిమీచరణయుగము జగన్నాథార్యా॥

౩ నేరిచినేరకనిత్యము। క్రూరతనొనరించుకర్మజాలములెల్లన్ కూరిమి
తోక్షమియింపుము జేరితిమీచరణయుగము జగన్నాథార్యా॥

౪ ఆరయతిరుమంత్రద్వయ సారమునాశ్రితులబ్రోవ సాయించితివీ ధా
రుణిదోషంబడగెను జేరితిమీచరణయుగము జగన్నాథార్యా॥

౫ క్రూరములౌ దుష్కృతములు మీరినరోషమున త్రుంచి మెరసిన ఘనని
చారిత్రముగొనియాడుచు జేరితిమీచరణయుగము ॥జ॥

౬ పారుడుకవ్యాపార్థమువార్థముగానుడువ చింతమగ్నాత్ముడవై పా
రార్థముకృపజేసితి జేరితిమీచరణయుగము ॥జ॥



౭ కాశ్రిత చరణయుగసరసీరుహమకరందపాన భ్రమరా సరము
లెంచక బ్రోవుము జేరితిమీచరణయుగము ॥జ॥
౮ తూర్పున చంద్రోదయమింపారగ పిలిపిల్లు మాడ్కి-జగ్గయపేటన్
మారుడన నుదయమైతివి జేరితిమీచరణయుగము ॥జ॥
౯ హేరామానుజ యతివర హేగురుమణి భాష్యకార హేవుడయవరే
సారెకు మిము స్తుతియింపగ జేరితిమీచరణయుగము ॥జ॥
౧౦ ఈరేడులోకములనీ పేరుసాటోసములులేరు వెదకిననైనన్ వేరుయు
పాయము తెలియక జేరితిమీచరణయుగము ॥ ॥
౧౧ ఆరామాంతఃపురస త్కారలసత్కుమార కాంతామణులన్ గో
రదు కేమిము దెలిసిన జేరితిమీచరణయుగము ॥జ॥
౧౨ సారెకుమీచరణము లింపారగ బూజించువారు సర్వోన్నతులై
మీరెదురు నమరగణముల జేరితిమీచరణయుగము ॥జ॥
౧౩ సారసనేత్రుని కృప నిండారగ నీభూతివ్యయము మీకిచ్చెనుగా భూ
రికృపమమ్ము బ్రోవుము జేరితిమీచరణయుగము ॥జ॥
౧౪ ఆరాజోత్తముకన్నియ కారాషిసి విషమ కెపుమనలయింపంగా ఆ
మాడిగపంచమిచ్చితి జేరితిమీచరణయుగము ॥జ॥
౧౫ నారాయణశబ్దార్థము సారెకుమనసూర మీరు సాయించినమా
కోరికలెల్లఫలించెను జేరితిమీచరణయుగము ॥జ॥
౧౬ కూరేశదాశరథులతో కూర్మిపహింపుమను మీరు గోష్ఠీపూర్ణుకాం
గోరిలభించిరిమంత్రము జేరితిమీచరణయుగము ॥జ॥
౧౭ శ్రీరంగంబుననుండియు నారంగసిచరణయుగమునను దినమును మీ
రారాధింపుచునుందురు జేరితిమీచరణయుగము ॥జ॥
౧౮ నారత్నమనాథనమా నారాజవరేణ్య మౌళి నాయతిచంద్రా నీరూ
పము నెడలించుము జేరితిమీచరణయుగము ॥జ॥

౧౯ చేరువవిలసిల్లిన కావేరీ తీర్థంబులాడికడు మోదముతో చేసుదువు
తిరుమతింటున జేరితిమీచరణయుగము ॥జ॥

౨౦ తీరుగ కాషాయాంబర ధారణ మొనరించి యూర్ధ్వపుండ్రంబులతో
మీరినరుచి గనుపింతువు జేరితి మీచరణయుగము ॥జ॥

౨౧ చారుతరసుందరాంగా మిగుప్రతికాశ ధైర్య మునిజనస్తుత్యా కార
ణాకార్యమునీవని జేరితిమీచరణయుగము ॥జ॥

౨౨ వీరాధివీరుమస్కతి వారణహస్తక శైవశైలాశనియా నారీమణి సం
రక్షక జేరితిమీచరణయుగము ॥జ॥

౨౩ వారాణసిక్షేత్రంబున పారితసుంద్రైన భాష్యసుమములుబొగడగా
శారదచేమెప్పించితి జేరితిమీచరణయుగము ॥జ॥

౨౪ కూరేశుని నేత్రంబులు నారాజాధమునిచేత నవమానింపగా కోరిన
నేత్రములిచ్చితి జేరితిమీచరణయుగము ॥జ॥

౨౫ దాసులకన్యము చేయగ క్రూరతనా రాజభటులు సుభగుభరాగ
భూరజము జల్లకదిలి జేరితిమీచరణయుగము ॥జ॥

౨౬ ఆరామప్రియుదేంగ వారణహాయ సైన్య దివ్యవర్గముతోడన్ తల్లితి
వి ఫిల్లి నగరము జేరితి మీచరణయుగము ॥జ॥

౨౭ నారాయణుడో। బ్రహ్మయో। నాకేశుడోయంచు। గుండెలదరుచు।
వణకన్। చారులుభయమునుబొందిరి। జేరితిమీచరణయుగము ॥జ॥

౨౮ కారాగృహముక్తుండై। కోరినానాచారుగూడు గుణసాగరుసిన్ చీ
రిరప్పించినావట జేరితిమీచరణయుగము ॥జ॥

౨౯ భేరీఢంకానౌబతు ఘోరుసమ్రోయంగ సురలుసుమములుగురియన్
తీరుగహరిసిల్పితివట జేరితిమీచరణయుగము ॥జ॥

౩౦ శ్రీరామసోదరుడవయి శారదపిసయోధ్య సీతమాతని మెపుదున్
మారాడాక సేవించితి జేరితిమీచరణయుగము ॥జ॥

## సీసపద్యములు

౧

జగన్నాథగురుభ్యోన్నమః

సీ॥ శ్రీజగన్నాథార్య శ్రీపాదపద్మముల్-సేవించువారికి శుభముగలుగు
శ్రీజగన్నాథార్య శ్రీసూక్తులాలింప-చెందరే భయములు చేతనులకు
శ్రీజగన్నాథార్య స్తుతిజేయువారికి-సిద్ధించు కోర్కెలు శ్రీఘ్రముగను
శ్రీజగన్నాథార్య సిరభక్తిబూనింప-సిరిసంపదలుగలిగి చెలగుకీర్తి॥

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।
మానసమున నవలోకనము సేయుచుండెదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెందిముక్తులై యలరుచుందు ॥

సీ॥ జగన్నాథగురుడయి [illegible]బు-సత్వంబు వినుడి సద్భక్తులార।
జగన్నాథగురుడయి చేతనాదుల ప్రోవ-జనియించె వినుడి సద్భక్తులార
జగన్నాథగురుడయి సకలమతముల-ఖండించె వినుడి సద్భక్తులార
జగన్నాథగురుడయి జనదోషములనెల్ల-హరియించు వినుడి సద్భక్తులార

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।
మానసమున నవలోకనము సేయుచుండెదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెందిముక్తులై యలరుచుందు ॥

సీ॥ జగన్నాథగురుడయి సచరాచరంబైన-బ్రహ్మంబు వినుడి సద్భక్తులార
జగన్నాథగురుడయి సకలోపనిషదర్థ-సారంబు వినుడి సద్భక్తులార
జగన్నాథగురుడు షట్ఛాస్త్రేతిహాసాది-మూలంబు వినుడి సద్భక్తులార
జగన్నాథగురుడు సత్పుణ్యపురాణ-స్వరూపంబు వినుడి సద్భక్తులార

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।

మానకనువర్తనము జేయు మంచిదనుమ ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెంది ముక్తులై యలరుచుందు ॥

సీ॥ జగన్నాథగురుతుష్టి దేవచతుర్ముఖ-సంతుష్టివినుడి సద్భక్తులార
జగన్నాథగురుతుష్టి పితృదేవతామల-సంతుష్టివినుడి సద్భక్తులార
జగన్నాథగురుతుష్టి త్రైలోక్యవాసుల-సంతుష్టివినుడి సద్భక్తులార
జగన్నాథగురుతుష్టి జలనవ్యతికహరి-సంతుష్టివినుడి సద్భక్తులార

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।
మానకనువర్తనము జేయు మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెంది ముక్తులై యలరుచుందు ॥

సీ॥ జగన్నాథగురుసేవ జపతిపాములకన్న-మించినఫలము సద్భక్తులార
జగన్నాథగురుసేవ తీర్థయాత్రాదుల-మించినఫలము సద్భక్తులార
జగన్నాథగురుసేవముష్టాంగయోగముల-మించినఫలముసద్భక్తులార
జగన్నాథగురుసేవ భూమిదానాముల-మించినఫలముసద్భక్తులార

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।
మానకనువర్తనము జేయు మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెంది ముక్తులై యలరుచుందు ॥

సీ॥ జగన్నాథగురుడెయ్యి జనసమూహమునకు-తల్లియుదండ్రి సద్భక్తులార
జగన్నాథగురుడెయ్యి జనసమూహమునకు-భ్రాతలానుజులుసద్భక్తులార
జగన్నాథగురుడెయ్యిజనసమూహమునకు-దాతయుదొరయుసద్భక్తులార
జగన్నాథగురుడెయ్యి జనసమూహమునకా-పుత్రులుబంధువుల్ భక్తులార

దురితాసంహారికిని। భక్త। నగులకాధారికిని। పగమకరశపివాసికి, భవ్యగుణచారిత్రికి। విరుళసరములుగూర్చి। పంపినవిష్ణుచిత్తుపుత్రికి। చెలి,

రాఘవార్యుని। పుత్రికి। సద్గురుడైన। మేఘనాథసుపుత్రికి। పాకశా సనస్తుత్యకూర్మపద్మజుని మాతకు। నానబృందము బ్రోవ వెలసిన। తమిళ తా యారమ్మ కెపుడు ॥ చెలియామంగళమన రే॥



మంగళహారతి.

కేదారగౌళరాగము. ఆటతాళము.

మంగళముకళ్యాణ। మహానియుధరితునకు। మంగళముశుద్ధగాత్ర

దానులకునూ! మంగళము దాసజనమ్ముందారునకు యిలను! రంగుగన్నవెల
యు! గురుపుంగవునకూ ॥జయమంగళం నిత్య శుభమంగళం॥

పరమపదమున కమలవరునితో! వాదించి! పరమధర్మములెల్ల
బయలుజేసి! కరుణతో రక్షించు! పంచభూతపురమందు! స్థిరముగా! వెలసి!
వ దీపికునకూ ॥జయ॥

పాషండచార్యుల! పొడ్గమతములకెల్ల! రోషముతో తోచి! నిశ్శే
షముగను! శేషభూతులకెల్ల! శేషియై! చెలనుల! శేషశాయినిజేర్చు! శే
ఖరులకూ ॥జయ॥

ధీరునకు శరధిగంభీరునకు! బుధజనోద్ధారునకు! కాషాయధారున
కునూ! సారతమమైన శ్రీ! భాష్యమునుకూరేశ! సూరులకు దెలుపునట్టి
దూరులకనూ ॥జయ॥

పురుషోత్తమార్యుల పాలుపారబూజించు! వరరాఘవార్యుల పద
యుగళమూ! అరలేకసకలకాలములందు! బూజించు! పరసన్మైనట్టియా
చతురునకునూ ॥జయ॥

కుదరవెల్లైమనాఖ్య! దసరిశృంగారపు! సదనములుగలుగు! తత్పా
రమునందూ! సదయులగుచును ఆదినారాయణస్వామియై! పుదయించినట్టి
యూవిబుధునకనూ ॥జయమంగళం నిత్యశుభమంగళం॥





పెరుమాళ్లు పిరాట్టిమార్లు మంగహారళతి.

నాటరాగము-అట తాళము.

మంగాళమని బాడరమ్మా। దంపతులకూ। మంగాళమని బాడరమ్మా॥ మంగళమనరేయీ। శృంగారమూర్తులను। పొంగుచూ। వాని గూడిన। రంగానీరాణికినీ ॥మంగా॥

మల్లేవిరులు దేగదరమ్మా। దంపతులపై। వుల్లామలరజల్లరమ్మా। గొల్లాభామలా।గూడిన। పుల్లాబ్జనేత్రునకు। పల్లావపాణియా మాతల్లి తాయారునకూ ॥మంగా॥

పొన్నాపొగాడాలు దేరమ్మా। దంపతులనూ। నన్నూతి జేసి। చల్లారమ్మా। పన్నాగశాయికీనా। పన్నారక్షణునకు। వెన్నానిరాణైయైన। పెలదీ తాయారునకు ॥మంగా॥

విరజాజినుమములూ దేరమ్మా। దంపతులకు। వరభక్తితో దాదాల్చరమ్మా। కరివరదునకూను। కనకాంబరునకును। దురితములను బాపి। గరిజేర్చు తాయారుకు ॥మంగ॥

అగరూగంధములు దీయరమ్మా। దంపతులకు సొగసుగామేని ఛాయరమ్మా। నిగమవిహారునకు। నిరుపమానతేజునకు। సుగతిగలుగ జూపే। నగుచున్న తాయారుకు ॥మంగ॥

పతితాముగొని యాడరమ్మా। దంపతులను। క్షితిలేనిసంపదలబ్బె నమ్మా। పతితపావనునకు। భక్తవత్సలునకూ। హితవులు కృపశేయు। గతియౌతాయారునకు ॥మంగ॥

వీరరాఘవగురుగొలచి । దాసులయొక్క । భారమంతయు। తామెమోసి । భూరికృపనుబ్రోచాదినారాయణాచార్యులకు। నేరమెంచక బ్రోవ్ర నెలతాతాయారమ్మకు॥ మంగళమని బాడరమ్మా। శ్రీ

ఆచార్యతిరువడిఘలేశరణం.

సంపూర్ణము.





యుదరితాయ మంగళము వేదాంతమార్గాయతే ॥మంగళంతే॥ కలిదోష
హారణాయ కరుణాంతరంగాయ। కందర్పవిజిత కాషాంబరాయతులసినలి
నాక్ష మాలికధరాయ స్వారశ్యగుణాయ మేఘగంభీరాయతే ॥మంగళం॥
తిరుమంత్రనిష్ఠాయ దుగ్ధాబ్ధివాసాయ। వరయోగి శ్రీమూర్తివైభవాయ। కలి
వేల్పుకైంకర్యనిరతాయ ప్రాజ్ఞాయ। వరభూషణాయ సర్వజ్ఞాయతే ॥మం॥
విబుధేంద్రపూజ్యాయ విజయాయ భక్తజనమిష్టార్థఫలదాయవీర్యా
యతే। శమదమాద్యాదిసద్గుణసాగరాయ జనకాంతాయ భువిమేరుధై
ర్యాయతే ॥మంగ॥ తిరుపుంకుందాళ క్షీరవంశాబ్ధి। వరపూర్ణ చంద్రు
లై సిసలారంగ। వరదుడైన శ్రీజగన్నాథార్యవర్యులై ధరకీర్తినొందిన ధ
న్యాయతే॥మంగళంతే శుభమంగళంతే॥

మంగళహారతి.

నాటరాగము- అటతాళము.

మంగళమనిపాడరే। బాలికలార। మంగళమనియానరే॥మంగళ
మనరే శ్రీభాష్యకార్లకు శుభ। మంగళం మాపెరుంబూధూరి నిలయులకు
॥మంగ॥ సరసిజములబోలు చరణములకు జానువులకు కాషాయాంబర
ములకూ। సురుచిరవళులకు సుందరోదరమునకు। తిరువక్షమునకు శ్రీశంఖచ
క్రములకు ॥మంగ॥ ఘనబాహుయుగళ త్రివండమునకు। కరములకును
నూర్ధ్వపుండ్రంబులకూ। వనమాలికలకు యజ్ఞోపవీతమునకు। కంబుగ్రీవ
మునకు చిగురాకు మోవికి॥ మంగ॥ కరుణారసముగుల్కు కనుదోయికిని
ముఖలోలుకు శ్రీమూర్తిముక్తావళికీ। వరనాసికమునకు సొంపు చెక్కిళ్లకు। వద
నమునకు శ్రోత్రములకు ముంగురులకు ॥మంగ॥ జగతిని శిరిపుంచు కచా
శాన్వయ జలధి। చంద్రులౌ జగన్నాథాచార్యులకూ। నిగమాంతసారము
నిరహేతుకంబుగ। నేర్పుతో సాయించు నిలయాళ్వార్లకు జయ॥మంగళము
నిపాడరే॥





సుగ్రీవుని మంగళహారతి.

ముఖారిరాగము- అటతాళము.

మంగాళమనరే। సుగ్రీవునకు। మంగళమనరే। మంగళమనరే॥
శ్రీ మారుతిరాజుకు।మంగళంకిష్కింధ మహీపతికిని జయ।మంగళమనరే
రవిసూనునకును। ప్రభంజనాజపబలువకును। భువి రాముకరుణచేభూకాం
తుడై యొప్పి। భూసుత వెదుకంగ బంపినపుణ్యునకు ॥మంగ॥ రాముతోగూర
డి।రాక్షసు।రాజ।సీననురుమాడి।పామరుడై నయాఘుటకర్ణు ముక్కును।చె
వులను తెగ బెరికి చేసినవీరుకు ॥మంగ॥ శిరిపురాన్వయము।శీతాంశుడనవి
గన్నాథగురులయి కరుణతో దాసుల కామ్యార్థములనొసగ।ఘనుని చేస్తు
తిల్లొందు కళ్యాణునకు జయ మంగాళమనరే॥





శ్రీ

# ఆంజనేయుల మంగళహారతి.

సురటి రాగము- ఏకతాళము.

మంగళంబనుచు బాడరే। హనుమంతునకును। మంగళంబనుచు బాడరే॥ మంగళం సుగ్రీవమంత్రిపుంగవునకు నిత్య। మంగళం రామపాదమగ్న మానసునకు మీరు ॥మంగ॥

రామలక్ష్మణులను జేరుచు। వినయంబుమీర। సామవాక్యముల నుబల్కుచు। నామగోత్రములను తెలిసి। రామరవిజులకును సంధి। ప్రేమతో దగూర్చినట్టి। పుణ్యునకును భక్తిమీర ॥మంగ॥

సీత వెదుకనాజ్ఞ బొందుచూ। వానరులకెల్ల। నీతిమార్గములను దెల్పుచూ। వాతవేగమునను నెగసి। వార్ధిదాటి లంకజొచ్చి। సీతజాడ కాంచి రాముని జేరి మ్రొక్కినట్టివాని ॥మంగ॥

ధరను సిరిపురాన్వయంబున। అవతారమొంది వరజగన్నాథగురుడన। నిరుపమాన వైభవముల నెగడి కీర్తనములు సేయు। పరమభక్తాగ్రగణ్యు। పాదపద్మములకు నెపుడు ॥మంగళంబనుచు బాడరే॥

నిరతము శ్రీయాదినారాయణస్వామ్యులు। చరణములే గతియని। స్మరణజేసి। మురయుచు రామానుజార్య। సన్నిధిజేర్చి। మన్నించిమము బ్రోచు। మంగళాయమ్మకు॥ మంగళం మంగళం॥



రామానుజార్య మంగళహారతి.

సురటరాగము ఆది తాళము

మంగళమాశ్రిత। మందారమునకు శుభ। మంగళం

శ్రీభాష్యకారులకు। మంగళంయతిరాజ। మానిచంద్రులకును మంగళం। మాగురువుంగారునకు। జయ। మంగళం మంగళం।

కాషాయచేలునకు। కరుణాసముద్రునకు। కళ్యాణగుణునకు। గంభీరు

కూ। శేషాంశమునకాంతి। మలిగథకాముసబుట్టి। సోమకులైనట్టి। భూత
పురీశునకు ॥మంగళం॥

పంచసంబులనా(శి। యంచిరహస్యము లో। అంచితభక్తి। లభించి
మించి। యెంచీపుర్కతము్లు। (దుంవిదిర్కులకీలే। నించిరక్షించిన। యిల
యాళ్వార్లనుఃజయా॥మంగళం॥

పరిమపదంబున। పరవాసుతోడను। పంచేమూలాండిన। ఫణిరాజుకూ
నిరతాము శ్రీవీరరాఘవ పరవనుకనుగొంటాము నుగ్గి ఘున నకు ॥మంగ॥

ముదముతో శ్రీమాదినారాయణాన్ర్యుల। పిదపద్మములయందు
(పవణులగుచూ। నుదిరపెల్లి సీతారామానుజాచార్యులై। పుడియాము నొంది
న। పుత్తమోత్తమునకూ ॥మంగళం మంగళం॥

మంగళహారతి.

కళ్యాణిరాగము-ఆదితాళము.

చెలియా మంగళము రే। తాయారుకు। చెలియా మంగళమన రే।జల
జలోచనురాణికి। జాళువాశరీరికి। మెలకసన్నులగరుడగమనుని।మోదమం
దజేయు। తల్లికి ॥చెలియా॥

కలుములజవరాలికి। పాల। కడలి(పియపు(త్రికి। నళినప(త్రనే(త్రికి।
నా్ర్తరక్షణ। వేషికి। తులసివనమున వెలసిదాసుల। దోషములు బోజే
యు కలికికి ॥చెలి॥

కరుణాస్వరూపిణికి। చా(క। ధరునిత్యానపాయికి। పరగదివ్యభూష
కూ। పంకజాసంజాతకూ। నరసిసంభవుపాదిగాభువి। సకలచేతన పురుష
కారికి ॥చెలి॥

గానవిత్యము గురుపాదకమలములను ।
మానకను వర్తనము శేయ మంచిదనుచు ।
దలచువారలు పుడమినిధన్యులగుచు ।
హరిపదముజెంది ముక్తులైయలరుచుందు ॥

సీ॥ జగన్నాధగురుపూజ జేసినకరము లే-కరములువినుడి సద్భక్తులార
జగన్నాధగురురూప మీక్షించుకన్నులే-కన్నులువినుడిసద్భక్తులార
జగన్నాధగురువరు స్తుతిచేయుజిహ్వ యే-జిహ్వయు వినుడిసద్భక్తులార
జగన్నాధగురుసూక్తు లాలించువీను లే-వీనులువినుడి సద్భక్తులార॥

గీ॥ గానవిత్యము గురుపాద కమలములను ।
మానకను వర్తనము శేయ మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదముజెంది ముక్తులైయలరుచుందు ।

సీ॥ సంసారసాగర తరణంబుజనులకు-జగన్నాధగురుడు ఈజగతిలోన।
కలుషకాననముకు కార్చిచ్చురూపము-జగన్నాధగురుడు ఈజగతిలోన॥
అజ్ఞానతిమిరంబు కరుణోదయంబగు-జగన్నాధగురుడు ఈజగతిలోన ।
అస్మదాదులబ్రోవనవతారమాయెను-జగన్నాధగురుడు ఈజగతిలోన

గీ॥ గానవిత్యము గురుపాదకమలములను ।
మానకనువర్తనము శేయ మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదముజెంది ముక్తులైయలరుచుందు ॥

సీ॥ జగన్నాధగురుసేవ జేసినవారికి-బడబాగ్నికీలల భయములేదు.
జగన్నాధగురుసేవ జేసినవారికి-సాగరోపద్రవ భయములేదు.
జగన్నాధగురుసేవ జేసినవారికి-పవమానువడిచేత భయములేదు

జగన్నాథగురుసేవ జేసినవారికి-శత్రుపీడాదుల భయములేదు ॥

గీ॥ గానసిత్యముగురుపాద కమలములను ।
మానకనువర్తనము శేయ మంచిదనుచు ।
దలచువారలుపుడమిని ధన్యులగుచు ।
హరిపదముజెంది ముక్తులైయులరుచుండు ॥

సీ॥ జగన్నాథగురువరు సామాన్యనరుడని-భావించిపూజింపమాను వారి
జగన్నాథగురువరు సామాన్యనరుడని-భావించిగహించిబలుకువారి
జగన్నాథగురువరు సామాన్యనరుడని-భావించిదుష్కర్మశేయువారి
కాలుండుచేపట్టి కట్టియూతనజెట్టి-కాలపాశముజుట్టికష్టబెట్టు ॥

గీ॥ గానసిత్యముగురుపాద కమలములను ।
మానకనువర్తనము శేయ మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదముజెంది ముక్తులైయులరుచుండు ॥

సీ॥ జగన్నాథగురుపాదసేవజేసెడువారి-దాసానదాసుడ ధన్యులార ।
జగన్నాథగురుపాదసేవ జేసెడువారి-క్రియవిక్రియార్హుడధన్యులార
జగన్నాథగురుపాద సేవజేసెడువారి-ఆజ్ఞానువర్తుడ ధన్యులార
జగన్నాథగురుపాద సేవజేసెడువారి- జయముగోరెడువాడ ధన్యులార

గీ॥ గానసిత్యముగురుపాద కమలములను ।
మానకనువర్తనము సేయ మంచిదనుచు ।
దలచువారలుపుడమిని ధన్యులగుచు ।
హరిపదముజెందిముక్తులైయులరుచుండు ॥

సీ॥ శ్రీరంబుమీగడచెరుకుపాల్ పక్వ-ర-జగన్నాథగురునినామంబువినుడి

హరిపదము జెంది ముక్తులై యలరుచుండు ॥ [ము

సీ॥ జగన్నాథగురువర్య జగదార్యయతివర్య-మిహిరప్రకాశార్య మీకు శుభ
కళ్యాణగుణచర్య కమనీయసౌందర్య-కామితార్థప్రద మీకు శుభము
అరివర్గజితశౌర్య అమరేంద్రనుతవర్య-ఆత్మసంరక్షణాచార్య శుభము
శుభతరంబైనసీ సీసమాల్యావళి-సొంపుగాజదివిన చెంగుశుభము॥

గీ॥ గాననిత్యముగురుపాద కమలములను ।
మానకనువర్తనము సేయ మంచిదనుచు ।
దలచువారలు పుడమిని ధన్యులగుచు ।
హరిపదము జెంది ముక్తులై యలరుచుండు ॥

సంపూర్ణము.







# తిరునామములు.

ముఖారిరాగము ఏకతాళము.

సమయామిదొరికెనీ స్వామినిబూజించి సద్గతిగానరాదా। కమలాక్షుభక్తులే ఘనులురక్షకులును కర్తలరయరాదా ॥సమ॥

భువనరక్షకుడైన పురుషోత్తమునికన్న పూజ్యులువేరేగాదా। దివిజగంధర్వాది దిక్పాలురకుదృష్టి ధీవర్యుతుష్టిగాదా ॥సమ॥

సకలపురాణేతిహాసశాస్త్రములకు సారార్థమిదియేగాదా। నిఖిలకల్మషవనా నిర్మూలదహనమీ నిజగురుసేవేగాదా ॥సమ॥

తనకుబిడ్డలుదారతమ్ములెందఱుగల్గ తప్పుచురారుగాదా। మనకుధారకపోషభోగ్యభూతులువగుచు మాధవుజేర్చుగాదా ॥సమ॥

శ్రీపురంజగన్నాథదేశికాచంద్రమాత్రై చేతనులనేలెగాదా। మఱువకమూగ్గళిమానసకైంకర్యము యుతుభక్తిజేయువాడా ॥సమ॥

సమయామిదొరికెనీ స్వామినిబూజించి సద్గతిగానరాదా ॥సమ॥

ఆనందభైరవిరాగము అటతాళము.

గురునిజేసినవారెధన్యులూ।వారి। కోర్కెదీర్చినవారుధన్యులూ। పరమ
పదంబున పరవాసుదేవుడను పతితులబ్రోవను పంతములాడిన ॥గురు॥

హరిగురుడనువారేధన్యులూ ।వారి। కడిమెజేసినవారుధన్యులూ।కరుణ
తో బౌద్ధచార్వాకాదిమతములు ఖండించిజగతిని కలిదోషామణచిన ॥గు॥

శేషీయాఖ్యాడనధన్యులూ।తత్। చ్ఛేషమనుకొనువారుధన్యులూ। శేషావ
తారులై చేతనులకుణను శేషమగునియుపదేశులై వెలశిన ॥గురు॥

కైంకర్యనిరతులుధన్యులూ। వారికనుకూలమగువారుధన్యులూ।శంఖ
చక్రాంకితవిద్యోర్ధ్వపుండ్రముల సంప్రదాయములెల్ల వెయ్యవహించిన॥గు॥

జగన్నాథాచార్యులెధన్యులూ। వారి। చరణముకే గతియన్న ధన్యులూ।
సొగసుగా శిరిపురకందాళాన్వయమున వగదీరనుదయించి వాశికెక్కి
న శ్రీను॥ గురునిజేసినవారె ధన్యులూ ॥గురు॥

ఆనందభైరవి అటతాళము,

జగన్నాథగురునీ శేవించూ।నీకు।సుఖముసిత్యముగలుగుచోటిసీకిమ్ము॥జ॥

నిఖలకర్మములద్రుంచూ ।నీకు। సకలధర్మములు స్వత్కృపతో భో
ధించూ ॥జగ॥

ప్రియముతో గురునిబూజించూ ।నీవ। ప్రియములుబలుకకవారిగాభా
వించూ ॥జగ॥ [॥జగ॥]

కామక్రోధములనణంచూ।స। త్కాపములను గోరికలివినహించూ

అపరాధముల భయముంచూ ।గురుడు। పురుషోనరహితుడు వ్యూహా
భావించూ ॥జగ॥ [జగ]

యమునియాతనలుదప్పించూ। వారి।సములుసద్గతులు లేదు శేవమొనర్చు

శిరిపురకందాళాన్వయము ।నుంచి। సిరిగ్గనుదయించె చంద్రుడై మ
నమూ॥ జగన్నాథగురుని శేవించూ॥

కళ్యాణిరాగము ఆదితాళము.

నాభాగ్యమేభాగ్యము గురువర నాభాగ్యమేభాగ్యమూ శ్రీభాష్య కారనీ శేవలభించెను ॥నాభా॥

శుభమూలుననుకూరె సొంపుగజతగూడి। అభయముగంటిశ్రీ హరి వన్నుపీడడింక ॥నాభా॥

శేషావతారనీచరణములనుగొల్వ।దోషముల్ భయమునదూరము బరుగెత్తె ॥నాభా॥ [॥నాభా॥]

అజ్ఞానతిమిరం బథగెనీతేజమున। సుజ్ఞానమునుగల్గె సూరులుమెచ్చగ నీకృపమార్గళినినిన్నూ పూజింపగ।నీలోకమునకీర్తి జగడిశియతిరాజ జగన్నాధచార్యానీచరితములెన్నగ।జననమరణము లేని సద్గతిగల్గెనాకు॥ నాభాగ్యమేభాగ్యము॥

ఆనందభైరవి ఆదితాళము.

వినుమా।గురునియాజ్ఞ జనుమా।ఓమనస నీవు వినుమా।గురూనియాజ్ఞజనుమా॥

జనులనుబ్రోవగ శేషాంశంబున। జగ్గయపేటనుజన్మించిరికృప ॥విను॥

జారాచోరుల జేరవద్దు। కామించిపరనారీమణులగోరవద్దు। స్వారసముగ తిరు మంత్రద్వయచరమార్థ రహస్యము లాదిగదెల్పును ॥విను॥

కాంతా సుతాదికలిమి స్థిరమా।యీలోకసంపద। శాంతాముబొందుటమనముకనమా। కాంతీమతిసుతు కరుణచేతనులు ఘనులైసద్గతికహుకొందురట ॥వినుమా॥

భ్రమరా కీటకన్యాయము తెరగు।జనపాలిదాసీ।ప్రమదాను। దేవిజేసిమరుగు। కమలాక్షునిప్రియభక్తులుదాసుల కలుషములన్నియు కానుకగాగొను ॥వినుమా॥

సిరిపురంబగన్నాథార్యవరులు కైంకర్యనిష్ఠాపరులైనవారి ధ్యాన సురగురుఘోరగ నగార్యానులుమది చోద్యమందగను శౌరిబ్రోమనట మహాగురూనియాజ్ఞ జనుమా ॥శ్రీ॥

కళ్యాణిరాగము ఆదితాళము.

ఆనందమానందమాయెనుమా। కానందమానందమాయెను॥ ఆనందపుత్రుని ఆనందగుణములు ఆనందవత్సర మానతిచ్చిరికృప। ఆనంద॥

ఇష్టములైనట్టి వినియోగముల సంతుష్టినిపొందిరి శుభములు గల్గెను ॥ఆనంద॥

సంగీతసాహిత్య సర్వార్థములుదెలసిసకలాత్మలనుబ్రోవ సద్గురుడౌ వెలసె ॥ఆనంద॥

భక్తితోయీగురు పాదకైంకర్యమను రక్తితోశేయుగ రక్షించుశ్రీపతి ॥ఆనంద॥

వింజామరలుభక్తుల్ విసరుచుమంగళ। వివిధవాయిద్యముల వేశ్యలునాట్యమాడ ॥ఆనంద॥

హరిగురువరుడగుచు అవతారమాయెనని। కరతలర్పించి అంజలిశేయగ ॥ఆనంద॥

శిష్యులనిత్య సంబంధమునుదెల్ప శేషాంశమునయిల్ల గన్నాథచార్యులైరి ఆనందమానందమాయెను.

మంగళహారతి

సురటరాగము-ఆటతాళము.

మంగళంతే శుభ స్మంగళంతే మంగళము శ్రీభాష్యకారయ శ్రీకాయః మంగళము చేతసోదారాయతే మంగళము పుణ్యాయ మహా

